# ప్రభవ గీతాలు



(కవితా సంహిత)

తంగేడుకుంట హెబ్బార్ నాగేశ్వరరావు






జాతీయ సాహిత్య పరిషత్
భాగ్యనగర్ శాఖ.

# ప్రభవ గీతాలు

(కవితా సంహిత)

తంగేడుకుంట హెబ్బార్ నాగేశ్వరరావు
(సబ్ ఎడిటర్, ఆంధ్రప్రభ, హైదరాబాదు)

ప్రతులు : వేయి

**మూల్యం : రూ. 5/-**

ప్రథమ ముద్రణ : విభవ సంవత్సరాది మార్చి 1988

ప్రచురణ :
**జాతీయ సాహిత్య పరిషత్**
భాగ్యనగర్ శాఖ
3-4-705/4
నారాయణగూడ
హైదరాబాదు - 500 029.

ప్రచురణ సంఖ్య : 3

ప్రతులకు :
**సాహిత్య నికేతన్**
3-4-852, బర్కత్‌పుర
హైదరాబాదు - 500 027.

**సాహిత్య నికేతన్**
ఏలూరు రోడ్డు
విజయవాడ - 2.

# ముఖేముఖే సరస్వతీ

'ముఖేముఖే సరస్వతీ' అని పెద్దల తీర్పు. ప్రాచీనభావం, అధునాతనమైన ఫక్కికలో ప్రభవించిన గీతాలు ఇవి. నాటికీ నేటికీ నిలిచిన భావనలివి. ఏ నాటికీ నిలిచే భావనలివి.

ప్రతి వక్తకూ, ప్రవక్తకూ, కవికీ, గాయకునికీ ప్రత్యేకమైన బాణీ ఒకటి ఏర్పడుతుంది. అది అతని సహజ ధోరణి. వైయక్తిక వైలక్షణ్యం భావ వ్యక్తీకరణ విధానంలో అభివ్యక్త మౌతుంది.

'ప్రభవ గీతాల్లో' శ్రీ నాగేశ్వరరావు ఆత్మీయత కొట్టవచ్చినట్టు కనబడుతుంది. శ్రీ నాగేశ్వరరావు ఎంతటి ప్రాచీన భావసంపన్నుడో అంతటి అధునాతన భావ ప్రేరితుడు. అధునాతన భావాలని ప్రాచీనతలో దర్శించగలిగే దృష్టి అతనికి కలగడం అదృష్టం. ఇతనిది సమ్యక్ దృష్టి. వంకర చూపుకాదు.

'ప్రభవ గీతాలు' మతాబాలు కావు; చిచ్చుబుడ్లుకావు. ఇతడు వాడిన ప్రతీకల్ని అర్థం చేసుకున్నట్లయితే, లోనారసినట్లయితే, నాగేశ్వర గవాక్షం గుండా విశ్వరోచిస్సు చల్లని వెలుగుగా సాక్షాత్కరిస్తుంది.

ప్రతీకాత్మక కవిత్వం పసిపిల్లలు మెచ్చదగింది కాదు. మహా అయితే వారికి ప్రతీకలు నచ్చవచ్చును. ప్రతీకలు వేటికి సంకేతాలో తెలియక పోవచ్చును.

'ప్రభవ గీతాలు' హృదయంతో పరిశీలిస్తే సహృదయంగమంగా ఉంటాయి.

ఆచార్య చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి
ప్రొఫెసర్, తెలుగుశాఖ
ఆంధ్ర విశ్వవిద్యాలయం
విశాఖపట్టణం

విభవ సంవత్సరాది
తేది : 18-3-1988
భాగ్యనగర్

# ఇవి ప్రభావ గీతాలు

చెట్టుమీద గూడు కట్టుకున్న పక్షి ఎటు తిరిగినా చివరికి గూడుకే చేరుతుంది. నౌకాగ్రం మీది కాకి సముద్రంలో ఎటు ఎగిరినా చివరికి నౌకాగ్రం మీదికే వస్తుంది. పుట్టిన చోటును వదలి వెళ్ళి ఎన్నిపాట్లు పడ్డా మానవుడు తిరిగి తిరిగి పుట్టిన చోటుకే వస్తాడు.

ఇలా రావడానికి ప్రధాన కారణం తన అస్తిత్వానికి ఆధారం ఆ స్థలం కావడమే. అలాంటి ఆధారాన్ని ఎవరూ తిట్టుకోరు! అక్కడ పుట్టిన నదీనదాల్ని, చెట్టు చేమల్ని, కొండల్నీ-కోనల్నీ, మట్టినీ-పుట్టనూ సమస్తాన్నీ తనతో కలుపుకొని ప్రతి మనిషీ తాదాత్మ్యం చెందుతాడు. ఆ తాదాత్మ్యం కారణంగానే తన చుట్టూ ఉన్న భూతభౌతిక తత్వం అతనికి దైవీమయంగా కనిపిస్తుంది.

అలా కనబడలేదంటే ఆ వ్యక్తికి వ్యక్తిగత శీలం, జాతీయ శీలం లేదన్న మాటే! ఏదో నిహిత స్వార్థ పిశాచం అతణ్ని ఆక్రమించిందన్న మాటే !

అధునాతన తెలుగు సాహిత్యంలో అభ్యుదయ కవిత్వం పేరిట చలామణి అవుతున్న కమ్యూనిస్టు కవిత్వాన్ని సరిగ్గా ఈ పిశాచమే ఆవహించింది. ఇది కమ్యూనిస్టు కవిత్వం అని చెప్పకుండా ప్రతీకలతో పదబంధాలతో సాహిత్యంలో చొచ్చుక వస్తున్న వీరంతా రష్యా చైనాల మానస పుత్రులు. ఈ దేశంలో కమ్యూనిజం నెలకొనాలంటే ఈ దేశాన్ని తిట్టాలి; ఇక్కడ పుట్టిన గ్రంథాల్ని తిట్టాలి; ఇక్కడి తత్వచింతనను

అపహాస్యం చేయాలి. వ్యక్తుల్ని వర్గాలుగా విభజించిన ద్వేషబుద్ధి తోనే ఇక్కడి సంస్కృతినికూడా శ్రేష్ఠుల సంస్కృతి అనీ అల్పుల సంస్కృతీ అని చీలికలు పేలికలు చేసి తిట్టిపోయాలి. వ్యక్తుల్లో, కుటుంబాల్లో, సమాజంలో వర్గాలు ఏర్పడి కొట్టుక చస్తుంటే అప్పుడు రష్యా సహకారంతోనో చైనా సహకారంతోనో ఈ దేశం అధికార పీఠం మీద తుపాకి పట్టుకొని కూచోవాలి. ఎంత రక్తపాతమైనా సరే! తమ "గోల్" అదే !

ఇలాంటి పైశాచిక దాహంతో భారతదేశంలోని అన్ని రంగాల్లో కమ్యూనిస్టులు అశాంతిని సృష్టిస్తున్నారు. సరిగ్గా ఈ "దమాకు" తోనే ఆధునిక తెలుగు కవిత్వంలో వేలుపెట్టి తమ వంతు బాధ్యతను నిర్వర్తిస్తున్నారు.

ఆధునిక తెలుగు కవిత్వంలో దేశ విద్రోహక రోగం ఒక వైపున ఇలా రక్తం కార్చుకుంటూ పయనిస్తోంటే, మరో వైపున దేశహిత కారకమైన చింతన, పరిమళాలు వెదజల్లుతూ కంటకావృత మార్గాన్ని పూల బాటగా మార్చుకొంటూ పయనిస్తున్నది. ఈ మార్గంలో పయనించే ప్రతి భారతీయుడు భారతమాత చరణ వేదిక మీద పూజా పుష్పంగా తనను తాను సమర్పించుకోడానికి సర్వదా సంసిద్ధంగా ఉంటాడు. విదేశీ మత-సోషల్ సామ్రాజ్య వాద దురహంకార శక్తుల దుస్తంత్రాల్ని - షడ్యంత్రాల్ని ఎండగట్టి దేశాన్ని మేల్కొల్పుతాడు; తల్లి రుణం తీర్చుకుంటాడు.

ఈ మట్టి బిడ్డ తాను ఏ వృత్తిలో ఉన్నా తన ప్రవృత్తి మాత్రం వదలి పెట్టడు. ఆ ప్రవృత్తే ఈ దేశంలోని ప్రజలందరిదీ అయిననాడు తన దేశం పరమ వైభవమనే గమ్యానికి చేరుకుంటుందని జీవితాంతం ఒక కార్యకర్తగానే ఉండిపోవాలనుకుంటాడు. ఆ కార్యకర్తే ఒక కావ్య కర్త అయిన సందర్భంలో ఇలాంటి "ప్రణవ గీతాలు" ఆవిర్భవిస్తాయి; ప్రభావ గీతాలు ప్రాదుర్భవిస్తాయి.

శ్రీ హెజ్బార్ అలాంటి కార్యకర్త; ఇలాంటి కావ్యకర్త. ప్రభవ నామ సం॥లో జాగృతి వారపత్రిక ప్రచురించిన ఈ గీతాల్ని గ్రంథ రూపంలో మన కందిస్తున్నాడీ కవి.

ఈ దేశం ఈవిధంగా ఉండడానికి కారణం ఏంటని ప్రశ్నిస్తూ "కాల పురుమని చేష్ట కాదిది - కాలుజారిన వారి కృతమిది" అని సమాధానిస్తాడు. అవును, కాలు జారిన వారెవరు? ఈ దేశీయులే! ఇక్కడ పుట్టిన వారే! విదేశీ దురాక్రమణల్ని ఎదిరించని వారే! ఆ దురాక్రమణ దారులకు మద్దతు పలికిన వారే! భుజం భుజం కలిపి ముందుకురికి దేశాన్ని రక్షించుకోకుండా ముసుగు తన్నిపడుకొన్నవారే! అనశ్వర జాతీయాత్మను రక్షించుకోడానికి ముందడుగు వేయకుండా నశ్వరశరీరాన్ని కాపాడుకోడానికి పిరికిమందు తాగినవారే! సంఘటనా మహామంత్రాన్ని జపించి ముందుకు సాగకుండా తన పక్కవాడి డొక్కలో బళ్ళెం కుచ్చినవాడే? సరిగ్గా ఇవాళ ఇలాంటి మనస్తత్వాలున్న విదేశీ ఇజాల బానిసల మూలంగానే మళ్ళీ దేశానికి ముప్పు వాటిల్లబోతున్నది.

ఆనాడు ముప్పు వచ్చింది నిజమే! కాని భారతీయుడేనాడూ ఎవరికీ బానిస కాలేదు. వెయ్యేళ్లూ తన అస్తిత్వాన్ని నిలుపుకోడానికి సంఘటిస్తూనే ఉన్నాడు; సంఘర్షిస్తూనే ఉన్నాడు. దారితప్పి దగాపడ్డ తమ్ముళ్లవల్ల మళ్ళీ ఈ సంఘర్షణ తప్పదు. అభారతీయతను బదాబదలుచేసి భారతీయ ఏకాత్మతను ప్రతిష్ఠించకతప్పదు. అందుకే

"శీల యుతము సమర పథము
అవిశ్రాంత శ్రమ సహితము
అజరామర విభవసిద్ధికై
సంఘటనా మంత్రము"

తప్పదు, తప్పదు అంటారు నవయువకవి శ్రీహెబ్బార్. "కర్తవ్య పథమ్మునందు - కనిపించెను వైభవ" మంటూ తనతో రమ్మంటాడు. "దోసిట నిండిన అర్ఘ్యజలాలు - ప్రగాఢ పరిశ్రమాజనిత - పవిత్ర స్వేద కణాలు" అంటూ అటు ఆధ్యాత్మికాత్మ సౌందర్యానికి ఇటు పారిశ్రామిక భౌతిక సౌందర్యానికి ఏతామువేసి భారతీయ సంస్కృతీతత్వాన్ని ప్రబోధి స్తాడు; సమన్వయ సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తాడు.

శ్రమదొక వర్గమంటూ ఆ వర్గాన్ని కత్తులెత్తి మిగతావారి కుతుక లుత్తరించుమంటూ హీనాతిహీనంగా ప్రవచించిన మార్క్సిజానికి ప్రాణం విలువ అసలే తెలువదనుకున్నాడు ఈ కవి. ఇంత వాచ్యం చేయకపోయినా ఆ కవిత అంతరంగంలో అదే భాసిస్తుంది. ప్రాణం నిలపడమే ప్రధానం అంటూ, మానవతావాదాన్ని ప్రబోధించే గ్రంథాలకంటే మిన్నగా ఈ ఖతం సిద్ధాంతమే సర్వోత్కృష్టమని తుపాకులు పట్టేవాళ్ళకు శ్రమ అంటే యేంటో తెలుసా! ప్రాణం విలువ ఎంతో తెలుసా!

"శ్రమజీవం శ్రమభావం
శ్రమనాదం శ్రమవేదం
శ్రమయోగం శ్రమభోగం
శ్రమతేజం శ్రమమోక్షం
శ్రమకాదొక వర్గము
శ్రమ సర్వ సమగ్రము
శ్రమ జగతికి సంకేతం
శ్రమ ప్రగతికి సాకేతం"

కేవల ప్రాణమేకాదు; శ్రమ సమగ్రం అంటారీకవి. భ్రమ - ప్రమల ద్వంద్వ భూయిష్ఠమైన ఈ ప్రపంచంలో విప్లవిస్తోన్న పడమటి గాలి వెనుక ఏ స్వార్థభూతమ్ముందో కనుగొమ్మని ఈ ప్రభవ గీతాల్లో

హెచ్చరిస్తాడు శ్రీ హెబ్బార్. ఆ గాలికి కొట్టుకొని పోవద్దంటాడు. భారతీయత, దేశభక్తి, అనుశాసనం, వ్యక్తిగతశీలం, జాతీయశీలం తదితర గుణాలే నీవుగా బ్రతుకుమంటాడు; సంఘటనా పథంలో నడువు మంటాడు.

ఈ సందేశాన్ని అందించే సందర్భంలో శ్రీహెబ్బార్ గుప్పించిన సంకేతాలెన్నో! అసలు ప్రభవే ఒక ప్రతీక. కాలచక్ర గమనంలో ప్రభవే ప్రాది. ఆ ప్రభవలో ప్రభవించిన "అమ్మ" భారతి; ప్రతిష్ఠించిన "గృహం" దేశం; "అర్ఘ్యజలం" ఆధ్యాత్మిక విజ్ఞాన ప్రవాహం; "స్వేద కణం" భౌతిక సంపద; "శ్రమ" అందరికీ కడుపునింపే మహాయజ్ఞం; "పడమటిగాలి'' దేశద్రోహ భావం; "యజ్ఞం" సంఘటనం; "రాక్షసులు" దేశద్రోహులు; "స్వ" - స్వీయతత్త్వం - స్వతంత్రం - స్వధర్మం - స్వరాజ్యం; "పర" - పరకీయ కుతంత్రం - షడ్యంత్రం-మతోన్మాదం-సోషల్ సామ్రాజ్యవాదం....ఇలా ఎన్ని ప్రతీకలో - ఎన్ని పరమార్థాలో ఈ గీతాల గుండెల నిండా.

ఇలాంటి ఈ గీతాల్లో పచనమయ్యీకాని వచనం, త్ర్యస్ర - మిశ్ర - చతరస్రాది గతులన్నీ అనుసరించీ అనుసరించని గేయం ఆద్యంతాల్లో ఉంది; సత్యశివ సౌందర్య సంక్రాంతుల్ని ప్రసరిస్తోంది. "ఛందస్సు అందమేకాని బంధంకాదు" అనిపించే గతులతోపాటు వ్యాకరణం తలకెక్కి భావజలధి బయటికి దూకిన పదరత్నాలెన్నో వెలుగుల్ని వెద జల్లుతాయి. భావుకులను చకచ్చకితుల్ని చేస్తాయి; ఇవి ప్రభవ గీతాలే! నిజంగా ప్రభావగీతాలే అనిపిస్తాయి.

''ధర్మభాస్కర ధవళశరములు, చిరుకాంతిమాల, ఇతిహాస సరిత్ జలాలు, స్వాదుకిరణం, వెలుగుకొమ్మ దరహసిత శరనిశిత సుందర వదనం, పెంపెల్లిరి, శ్రేయోభావక్షీరం। తీపిసిద్ధాంతం, పాశవిక దళవద

అని పాశ్చాత్య శిశువులు, సొల్లుగార్చు వాజమ్మలు, దాస్యవారుణి వాసన, ఆమని జిలుగు" - ఇలా ఎన్నో ప్రయోగాలు.

ఈ ప్రయోగాలతో ఈ పదబంధాలతో ఒకచోట తట్టిచెప్పుతాడు కవి; మరోచోట నిలబెట్టి చెప్పుతాడు కవి; వేరొకచోట తిట్టి చెప్పుతాడు కవి; ఇంకొకచోట కొట్టి చెప్పుతాడు కవి. ఎవరికెట్లా చెప్పాలో అట్లాచెప్పక తప్పదుమరి! ఈ హెబ్బార్ అందుకే కవి, నిజమైనకవి, నవకవి, యువ కవి, అభినవ జాతీయ కవి.

డా॥ కసిరెడ్డి

కార్యదర్శి

జాతీయ సాహిత్య పరిషత్

ఆంధ్రప్రదేశ్

భాగ్యనగర్

విభవ సంవత్సరాది

తేది : 18-3-1988

## ఇవీ గీతాలు....

# అంకితం

త్యాగభావ రూపాలకు,
ప్రగతిభావ దీపాలకు,
సామాజిక సంఘటనా
శ్రమజీవన రాగాలకు
సరిగమలను సమకూర్చే
కర్తవ్య స్వరూపాలకు,
రాష్ట్రీయ స్వయంసేవక
సంఘ ప్రచారకులకు....

— హెబ్బార్

# మాతృ ప్రశస్తి

సీ॥ సకల లోకములకు సంస్కృతీ మధువుల
పాత్రనందించిన భరత భూమి
సర్వప్రజాహిత సద్భావ పరిమళ
విరివనమ్ముల నిండు వేద భూమి
మత సామరస్య సువ్రత యజ్ఞ ఫలముల
విందు చేసిన యట్టి హిందు భూమి
సంగీత సాహిత్య సౌశీల్య భాగ్యముల్
గాదెల నిండు బంగారు భూమి

తే॥ గీ॥ దైత్య భావాలు నిర్జించు ధర్మ భూమి
ధర్మ వాహిని ప్రవహించు కర్మ భూమి
సురలు దిగివచ్చి విహరించు సిరుల భూమి
మహిత మంగళ రూపిణి మాతృ భూమి.

# ఆచార్య సంస్తుతి

[నెల్లూరు వెంకటగిరి రాజా కళాశాల ప్రాచ్య భాషా విభాగం భూత పూర్వ అధ్యక్షుడు పూజనీయ శ్రీ పోలూరి హనుమజ్జానకీరామశర్మను ఉద్దేశించి]

పల్లవి : వందనాలు వందనాలు వందనాలు గురువర్యా
ఆసంఖ్యాక శిష్యకోటి కాధారం నీవయ్యా

చరణం : 1. చూడలేదు వాల్మీకిని చూడలేదు శ్రీ వ్యాసుని
చూడలేదు ఆల వసిష్ఠ విశ్వామిత్రాఖ్యులను
ఆ పరంపరాగతమౌ ఆచార్యుడవీవయ్యా
నీ యందే వారందరి శోభలు నెలకొనెనయ్యా.

2. ఒకే జాతి ఒకే నీతి ఒకటే మన సంస్కృతి
ఒకే జీవవాహినిగా ప్రవహించెను భారతి
ఆర్షవర్షధారలు ఆధారంగా సాగె ప్రగతి
ఆధారలు కురిపించెడి యజ్ఞమె నీ జీవనగతి.

3. అద్వైతామృత పరిమళ భరితము మీ హృదయము
అద్వితీయ అమల అమర గంగాఝరి వచనము
మిమ్ము వంటి సుతుల కనుట భరతమాత పుణ్యము
మీ శిష్యుడనైనందుకు నా జన్మము ధన్యము.

4. విశ్వశ్రేయః కావ్యములమరించిన వేద నిధీ
సర్వ ప్రజాహిత వ్యవస్థ సాధించుట మనకు విధి
మమ్ముల నాశీర్వదించి మహనీయా గురువర్యా
జాతీయ పథమ్మునందు ఎల్లర నడిపింపవయ్యా.

వందనాలు వందనాలు వందనాలు గురువర్యా
ఆసంఖ్యాక శిష్య కోటి కాధారం నీవయ్యా.

[నెల్లూరు నుండి వెలువడే 'లాయర్' పత్రికనుండి ఉద్ధృతము]

# నా కవిత

ఆమె
నన్ను ఏనాడో వలచింది
నానాటికీ ఎదుగుతూ వచ్చింది!
తన సుందర మధురాక్షర
అనునయ నయనాల గీటి
జాతీయ ప్రభావపూర్ణ
మైన హృదయ వీణ మీటి
సంఘటనా స్వరసరాగ
భంగిమలతో పులకించి
అణువణువున గత వైభవ
రస మాధురి నింపునామె!

తారక ఉదయించునపుడు
కైరవపతి కదలునపుడు
విరుల పరిమళము గైకొని
చిరుగాలులు సోకునపుడు,
వీరుల గంభీరుల నిజ
పౌరుష జ్యోతుల భారత
మాతకు హారతులిచ్చిన
శూరుల తేజోమయ స్మృతితో
పరవశమును కూర్చునామె!

అనుభూతులు అంతరించి
అనుమానము సంతరించి
విఘటన తాపపు దాడికి
దుర్ఘటనాగ్నుల వేడికి
హైందవ మానస క్షేత్రము
బీటలు వారిన వేళల........
మహనీయుల, ఋషివర్యుల
తపోధనుల, ధర్మ నిధుల
వేద శాస్త్రసారము నా
స్వాదించిన వారల
విజ్ఞానామృత ధారలు
కురిపించగ సాగుచున్న
సాహిత్యపు యజ్ఞంలో
నన్నూ సమిధను కమ్మని
విజ్ఞప్తి స్తోంది ఆమె!
ఆజ్ఞాపిస్తోంది ఆమె!!

అన్నార్తుల ఆక్రందన
విన్నప్పుడు, నిరుపేదలు
ఉన్న కుటీరాల స్థితిని
కన్నప్పుడు, కల్లోలిత
సాగరమై హెచ్చరికల
తరంగాలు రేపు నామె!

ఆత్మశక్తి గురుతెరిగి
స్వార్థరహిత శ్రమ జరిగి
సర్వ ప్రజాహిత రాజ్యము
సఫలు తీరునన్న ఆశ
ఝరియై జాగృతి భూముల
దరికి సాగుతోంది ఆమె!!

ఆమె పేరు కవిత,
సనాతన సంస్కృతీ పవనజ్వలిత,
చైతన్య తేజస్సంభరిత,
జనతంత్ర భావాజ్య ప్రేరిత,
మానవతా వాద వేద
నాద సమూహోద్దీపిత!!

(1984 జూలై 30 వ తేదీ నాటి 'జాగృతి' పత్రిక నుండి ఉద్ధృతము)

# ప్రభ శుభ

ప్రభవ !
చాంద్రమాన చంద్రయాన
దిశారథం కదలుతోంది
రథ స్థిత ప్రభవ కాల
పురుషుని మది మెదలుతోంది !

గతంలో....
అవగత స్మృతి పథంలో
సుదూరాన
నీలాంబర తీరంలో
మానస క్షేత్రంపై వసంత
కాంతుల ప్రవాహం కమ్మినవేళ
చైత్రకుసుమ గంధాలు
మకరందం చిమ్మినవేళ
'ఆమె' చరణాభరణ
ఝుళం ఝుళలు కాల
పురుషుని గీతాలకు
సరసభావ సరిగమలు
సమకూర్చిన దృశ్యం
సమష్టి శుభాలను
వర్షించిన దృశ్యం.... ....

లీలగా చిరుకాంతి మాలగా
ప్రభవించింది ప్రభవింపింది !
కురిసిన ప్రతి బిందుకణం
మురిసినదై సమీకృతిని
అరసినదై సహజన్మల
సరసజేరి సుసంఘటిత
చరితమై సామాజిక
సరితమై సంస్కృతి సం
భరితమై జాతీయత
మెరసి మెరసి మహో
జ్వాల ప్రవాహమై మహా
జల ప్రవాహమై.......

ప్రభవ ప్రభవ !
మరో జన్మ మరో జన్మ
ప్రతిసారీ మహాజన్మ
సృష్టి స్థితి లయ వలయం
సృష్టించిన వెలుగు కొమ్మ !

........గతం నుండి భవిత వైపు
ప్రవాహ గతి సాగుతోంది
మహాభూమి పండించగ
మహోత్సుకత ఉరుకుతోంది
మరోస్మృతి మెదలుతోంది
మహాస్మృతి మాయనంది !

3

ప్రవాహాన విషం కలిసె
ప్రభవ కంట మంచు కురిసె
విద్రోహపు విద్వేషం
ప్రభవ గుండె మంట రేపె........

ప్రభవ ప్రభవ మరో ప్రభవ
అవతరించె అరుణ విభవ !
........అదిగో ఆ దిక్కు చూడు
అమృత లక్ష్య సిద్ధితోడు ! !
పదపదమన్నది 'హృదయం'
ప్రవాహానసమ్మిళితం
విషం విరిగి పోతోంది
ఉషః కాంతి పెరుగుతోంది
అమల సుజల ప్రగతి పథం
అద్దంలా వెలుగుతోంది....

ప్రభవ ప్రభవ మరో ప్రభవ
మన 'అమ్మ'కు మహా విభవ ! !

# అందని స్మృతి

ఎంత జాలి ఈ ప్రకృతికి
వసంతపు గాలి 'మోహనాకృతి'కి!
విచ్చిన కనుదోయికి మాత్రం
ముచ్చటగానే కనిపిస్తున్నా
సచ్చరితకు కలిగిన గాయం
చెరగిపోనని సొదచేస్తున్నది!
చలి మింగిన సవితా కాంతులు
బలపడి చెలరేగుతు ఉన్నా
మానస సీమలలో మాత్రం
మంచుతెరలు తొలగుట లేదు
సంధియుగం సంధించే శరములు
చేస్తున్నవి మధుర రోదనలు!!

ఎక్కడివో?
ఎక్కడివో ఈ అనుభూతులు
చిక్కువిడని చుక్కల కవాతులు !
ఎంత వెదకినా
కాంతుల నెంత కదిపినా
జ్ఞాపకాల దొంతరలను
ఎంత కుదిపినా
దీర్ఘతమ దివ్య చక్షువులను
ప్రసరించి పరికించినా

## 5

ఈ ప్రశాంత శాంతి వాహిని
కన్నతల్లి కన్పించడం లేదు
ఆ శైశవ డోలికా ధవళ ప్రభలు
ప్రస్ఫుటించడం లేదు!!

అయినా 'నేను' ఏం చేయను?
'ప్రభవ' మళ్ళీ వచ్చేసింది
లయంకాని స్మృతుల లయలతో
పదధ్వనులను శ్రుతి చేస్తున్నది!

పరివాస పరిప్లుతం
పరిప్ల విస్తోంది
ప్రవిష్ట ప్రగతి గీతం
ప్రవిప్ల విస్తోంది!!

# పునరాగమనమ్

ప్రశాంత వసంత నిశాంత వేళ
ప్రభాత పీఠం పై నిలుచున్న 'హృదయం'
ప్రమోద వేద స్వరాలను
ఘోషిస్తున్న వేళ
మానవతా సుగంధ మంత్ర సరాలు
భాసిస్తున్న వేళ
ఇతిహాస సరిత్ జలాలు
సరికొత్త గతులను
సంతరించు కొంటున్న వేళ
సకల కర్మ సాక్షి స్వాదు కిరణాల
తొలి రూపు తొంగి చూసిన వేళ........

'ఆమె' శుభ తేజం తళుక్కుమంది
'గృహ' ప్రాంగణ కాంతి సముజ్వలించింది !
ఆరు పదుల వసంతాల నిరీక్షణ
'ఆమె' అందాలకు కొత్త మెరుగులు దిద్దింది
దరహసిత శరనిశిత సుందర వదనం
అర్ఘ్య జలాలలో ప్రతిబింబించింది!
అభంగ అమృతాచార ప్రతీకలైన జలాలు
'ఆమె' ముఖ దర్పణంలో తమ
స్వరూపాన్ని తిలకించాయి

7

స్మృతుల విశ్వరూపం చూసి
పులకించాయి.... .... ....

వదనంలో జలాలు జలంలో వదనాలు
శత సహస్ర రూప ప్రతి రూపాలు
ప్రతి రూపంలోను ప్రగతి భావగతులు
సనాతన సంస్కృతీ చరిత గతులు !
'నేను' మాత్రం బింబ ప్రతిబింబాలను
గమనించడం లేదు
'ఆమె' వచ్చిన సంగతిని
గురితించడం లేదు.... ...

ప్రభవిస్తున్న సవిత్రుని పై 'నా' దృష్టి
సంధ్యా క్షేత్రం పై అర్ఘ్యజలాల వృష్టి !

# నిరంతరమ్

దోసిట నిండిన అర్ఘ్య జలాలు....
ప్రగాఢ పరిశ్రమా జనిత
పవిత్ర స్వేద కణాలు,

అవిశ్రామ భావాశ్రయ ఆశ్రమ
వాటికాభ్యుదయ సుమాలు
స్రవించిన మధుర మరందాలు,

'నిద్రా భయ మైథున' సామ్య
తమస్సును ఛేదించుకొని
అంకురించిన సస్య హరిత
గణాలు బాష్పించిన తుహిన వనాలు,

ప్రకృతీ చక్ర పరిభ్రమణ
ప్రభావిత ఆర్ష పర్జన్యం
వర్షించిన అద్వైతామృతాలు,
విశ్వ హితైక యజ్ఞ పర్యవేక్షక
మాతృ నయనాలు చిలికిన
హర్ష జలాలు ........
దోసిట నిండిన అర్ఘ్య జలాలు !

సంస్కృతీ సౌధ నిర్మాణంలో
శత సహస్ర హుతాత్మల శ్రమ
శ్రమ జలాల అమల సరిత
సౌధ సంప్రోక్షణ చేసే అమర చరిత !

.... .... .... .... .... .... .... .... .... ....

గతి గతిలో ప్రభవించిన
ధృతి ధరించె దివ్యాకృతి
కృతి కృతిలో జత కూడిన
మతి జగతికి జీవన ఖ్యాతి
హర్ష వ్యథా సరిగమలకు
అతీతమౌ ప్రవాహ గతి
మను సంతతి జన సంతతి
మానస క్షేత్రాల ప్రగతి !

ప్రగతి చిత్ర రూపాలకు
పులకించెను 'ఆమె' ముఖం
ప్రతి రూప స్వరూపాలతొ
పరవశించె అర్ఘ్య జలం
'నా' దోయిలి ఆ ప్రవాహ
భాగమైన జల భరితం
ప్రవాహమో ? మానవతా
ఘుధువు నిండు జలజ రథం !

# పురస్సరమ్

స్తబ్ధ నిశ్శబ్ద నిర్వాంఛా
గగన మస్తిష్కంలో
'శ్రమ' మయూఖ రేఖాణువు
సంచలనం సృష్టించింది
అనిర్వచిత అనాభి హిత
అనుభూతిని అమరించింది!

.... .... .... .... ....

అణువణువూ కలసి కలసి
అనంతమై అభంగమై
పరిశ్రమ విశ్వరూప
'ప్రభ' నభాన వెలిగింది
ఆ వెలుగే కర్తవ్యం, ఋతు
వలయం గతి వలయం
లయం కాని పరమోజ్వల
భావ జ్వాలలకు నిలయం!

'శ్రమ' కాంతులు దారి చూపె
శ్రమ ధారలు దప్పి తీర్చె
శ్రమ చేతన తమో జనిత
'భ్రమ'ను మాపి 'ప్రమ'ను గూర్చె

శ్రమ భావన తపో ధిషణ
తలపై వేదాలనిలిపె
శ్రమ ప్రోదిని ప్రోదితమై
అమర గంగ అవని వెలసె!

ముని వాటిక శ్రమ ఫలించి
ధర్మశక్తి ప్రతిఫలించె
కవిజన స్థిత శ్రమ వికసించి
శ్రేయో వాణిని వరించె
కార్మిక శ్రమ కండబలం
ప్రగతిచక్ర ప్రతిరూపం
కర్షక శ్రమ వర్షం ఫలం
ప్రపంచానికే ప్రాణం!

శ్రమ శిల్పం విశ్వానికి
సుందర శోభలు దిద్దెను
సౌశీల్య సుమాల విరియు
ప్రతిభా పరిమళ మద్దెను
శ్రమ వాయుధ్వనుల నుండి
ప్రస్ఫుటించె 'ఓం' కారం
శ్రమజీవన శంఖధ్వాన
సమాహితము సంగీతం!

శ్రమ జీవం శ్రమ భావం
శ్రమ నాదం శ్రమ వేదం

శ్రమ యోగం శ్రమ భోగం
శ్రమ తేజం శ్రమ మోక్షం
శ్రమ కాదొక 'వర్గము'
శ్రమ సర్వ 'సమగ్రము'
శ్రమ జగతికి సంకేతం
శ్రమ ప్రగతికి సాకేతం!

ఈ సమగ్ర శ్రమ జలాల
సంస్కృతి నది సాగుతోంది
'గృహ' ప్రాంగణ సీమ సస్య
శ్యామలమై వెలగుతోంది
ఈ సరితా స్థితికి గతికి
'ప్రభవ' కాంత ప్రబల సాక్షి
అనుజన్ముల వీక్షణ తతి
అనుశ్రుతము అమర సాక్షి

# శ్రమ జీవనమ్

నిరంతర భ్రమణ పరిభ్రమణ
పరిశ్రమతో భూమాత సుందర
ఉషస్సులను సృష్టించింది,
శశాంక శోభల సుధామధుర
కిరణాలను వెదజల్లింది,
వనసీమలకు ఆమని
సొగసులను అమరించింది....!

.... .... .... .... .... .... .... ....

శ్రమ చేతన క్షణంవీగి
ఆలసత్వం చెలరేగి
హఠాత్తుగా భూమి ఆగి
అధః పతనమైపోతే....
ఏమౌతుంది ? అపుడేమౌతుంది ?

తిరిగి తిరిగి శ్రమ జలాల
తడిసిన ఆ చందమామ
హాయి ఏల కూర్చోలని
హాయిగ కూర్చుండి పోతే....
ఏమవుతుంది? అపుడేమౌతుంది?
యుగయుగాల వ్యవధి మించి

నగసీమల నధిగమించి
ముళ్ళ పొదల రాళ్ళ ఎదల
సంఘర్షణ సాగిస్తూ
సస్యహరిత క్షేత్రాలను
సమకూర్చే సురసరితలు
శ్రమ ఇక సాధ్యం కాదని
ఆగి అణగి అలసటతో
అవని గర్భమున దాగితె....?
ఏమౌతుంది ? అపుడేమౌతుంది ?

జీవశక్తి జ్యోతులకు
జవసత్వం ప్రసాదించు
గాలి శ్రమకు ఓర్వజాల
నంటూ స్తంభించిపోతే ?
సామాజిక సంఘటనా
శ్రమ జీవన రాగాలకు
సరిగమలను సమకూర్చే
స్వర విపంచి నిదురిస్తే?
అమృత వర్షధారలకై
ఆరంభిత యజ్ఞంలో
శ్రమకోర్వక అగ్నిజ్వాల
విశ్రాంతిని వాంఛిస్తే....
ఏమౌతుంది ? అపుడేమౌతుంది ? ?

శ్రమ చేయని నాడు జగతి
అంతరించుపోవు ప్రగతి
శ్రమ చేయనివాడు సకల
జనుల దోచు దుండగీడు !
ఆగని శ్రమ సాధించిన
భోగము సంస్కృతి యోగము
ఆగిన శ్రమ ప్రతిరూపం
సంప్రాప్తించిన పతనం ! !

.... .... .... .... .... .... ....

ప్రాభవ పతనాల చరిత
గతులు ప్రస్ఫుటించినాయి
'ప్రభవ' ప్రాతర్ జలాల
రూపమ్ములు కదలినాయి !

# ఎన్నవసారి?

'గృహ' ప్రాంగణ పవిత్ర క్షేత్రంపై
'ఆమె' శుభ చరణ మంజీరాలు
ఝుళం ఝుళలు సృష్టించుట ఎన్నవసారో ?
విభవ స్మృతుల మకరందపు -
విభావ మా హృదయంపై
మరోసారి నృత్యించుట ఎన్నవమారో?

చ్యుతి ఎరుగని స్థితి వలయ
స్థితయా సంస్తుత మతి యా
భామ ప్రగతి భావరామ
'నా' ఇంటికి వచ్చుట ఇది
ఎన్నవసారో ?....... .......

క్రితంసారి వచ్చినపుడు
కలిగిన అనుభవ స్మృతులకు
జతకూడెను ఆరు పదుల
అశ్వని కార్తులు కృతులు!
ఎన్నిసార్లు అరుదెంచెనొ
'ఆమె' కే తెలియదట
ఎన్నిసార్లు రానున్నదో
ఎవరికేమి తెలుసునట !

అరుదెంచుట,
వాస్తవాల గురుతెరుగుట
గత స్మృతులను వెలయించుట
ఆశయాల గమ్యానికి
అనుక్షణం పయనించుట
'ఆమె' సహజ కర్తవ్యం
సడలిపోని ఋతు ధర్మం !

.... .... .... .... .... .... .... ....

స్మృతి పథంలో మలచిన
ముళ్ల పొదలు
జాగృతీ రథ గమనాన్ని
నిరోధిస్తున్న దృశ్యాలు,
పశ్చిమ దిశ నుండి వీచిన
దుర్గంధ ప్రభంజనంతో
కొట్టుకు వచ్చిన విషబీజాలు
మహా వృక్షాలై
సంస్కృతీ సీమలను విద్రోహపు
ఛాయలతో నింపిన దృశ్యాలు,
ఇతిహాస ఇందు బింబంపై
విజయారుణ ఇన కాంతులు
పడకుండా అడ్డుకున్న

ఆనైక్యతా గ్రహణాలు
దిగజారిన గుణాలు,
శ్రుతి రాగా లాపనతో
ప్రతిధ్వనించు సురభూములు
అసురుల వికృత ధ్వనులతో
కంపించిన కథలు, వ్యథలు.
'ఆమె' మదిని స్ఫురించెను
ఆ ముఖాన సఖ తీరెను
దోసిట నిండిన జలముల
ప్రతిబింబం భాసించెను !

# ఇప్పుడిప్పుడే

వెయ్యేళ్ళు వీచిన విష ప్రభంజన
ఛాయలు ఇంకా చెరిగి పోలేదు
'గృహ' ప్రాంగణమంతా పేరుకొన్న
దుర్గంధం తొలగి పోలేదు !
దుర్నిశీధి సృష్టించిన
దుస్స్వప్న ప్రభావం నుండి
'అమ్మ' ఇంకా కోలుకో లేదు
తుఫాను తాకిడికి తల్లడిల్లిన
తోట ఇంకా తేరుకో లేదు !

దొంగలు ...............
వెయ్యేళ్ళకు పైగా
'నా' ఇంటిని దోచుకున్న
గజ దొంగలు,
శుక్తి మౌక్తిక శుభ్ర
మణిమయ సీమలను
రక్త సిక్తం చేసిన రాబందులు,
మానవతామృత నదులను
మలినం చేసిన పందులు,
వీరుల వేషంతో వెడలిన
విద్రోహులు, ఘన చోరులు !

క్రితంసారి 'ఆమె' వచ్చినప్పుడు
దొంగలింకా తిష్ఠవేసి ఉన్నారు
నేడు దొంగలు లేరు, కానీ
వారి పద్ధతులు ప్రతిష్ఠమయ్యాయి!
వెయ్యేళ్లపాటు పులిసిన
చోరదాస్య మధువును
పీకలదాకా తాగిన ఉన్మాదులు
కేకలు వేస్తున్నారు, దొంగల
గీతం వినిపిస్తున్నారు!
చెదలు పట్టిన ఆ మెదళ్లలో
జన్మిస్తున్న చీడ పురుగులు
'ప్రాంగణం' లోని పూలమొక్కల్ని
పట్టి పీడిస్తున్నాయి
'అమ్మ' గుండెను మండిస్తున్నాయి!

.... ......... .... .... .... .... .... ....

మత్తు వదలని మందమతులు
హత్తుకుంటున్నారు బురదను
నిద్ర వీడక తూలుతూ
అదే సుఖమని సోలుతూ....
నిద్ర లేచిన యోద్ధలందరు
కాంతి కిరణుని కొలచుచుండిరి
ఐక్యమంత్ర స్వరము లను
అనురక్తిగా ఆలాపించుచుండిరి!

ఒక్క కంట శోకాగ్ని జ్వాలలు
ఒక్క కంట ఆనంద సుధలు
సంగమించెను హర్షవ్యథలు
ప్రాంగణమ్మున 'ప్రభవ' గతులు!

# వాస్తవ వీక్షణ

'నా' గృహం ........
శత సహస్రాధిక యోజన విస్తీర్ణం
గతి దప్పిన అతిథులకు
ధృతి కూర్చిన కేదారం !

'నా' గృహం ....

సహస్రాధిక యుగాల చరిత్రకు
సహిష్ణుతా భావ పుటలను
సమకూర్చిన మానవతా మందిరం,
శ్రేయః పరిమళ వీచికలను
వ్యాప్తి చేసిన సంస్కృతీ నందనం !

'నా' గృహం....

సంస్కార వేణు నాదాలు
మోగిన మధుర బృందావనం
సాహితీ సుధలను పంచిన
సాక్షర క్షీర సముద్రం !

.... .... .. . ....... .... ....

గగనమంటు హిమకుడ్యం
మిగిలిన వైపుల తోయం

జగతిని నడిపిన శీలం
ప్రభ కూర్చిన శుభ కిరణం
అనాదిగా ఉంది 'గృహం'
పునాది ఐనది ధర్మం
శ్రమ జలమై సుమ ఫలముల
సమకూర్చె సమష్టి వ్రతం !

....ఏమైందీ నాడు 'ఇల్లు'
వెతకసాగె ప్రభవ కళ్లు ........
వ్యథ నిండిన వీక్షణాల
వెడలించినవీ క్షణాలు!!

యుగయుగాల నాటి 'ఇల్లు'
సగందాక చీలె నేడు
'అమ్మ' కంఠమందు రక్త
ధార కాల్వ కట్టె నేడు
అదేమిటి???
అదేమిటి దిక్కునందు
ఆవుల వధ జరుగుతోంది?
గోగణ సీమల నక్కల
గుంపొక్కటి కూచున్నది !

.... .... .... .... .... .... ....

నక్కల గుంపును తరిమి
గోకులోద్ధరణ చేయగ

'అమ్మ' గాయమును మాన్పి
'హర్మ్యము' నొక్కటి చేయగ
మేలుకొన్న సోదరులు
వేలకు వేలై లేచిరి
సమైక్యతా సుప్రభాత
గీతము నాలాపించిరి!

ఒక్కకంట దుఃఖఛాయలు
ఒక్కకంట హర్షశోభలు
సంగమించెను హర్షవ్యథలు
'ప్రాంగణమ్మ'న 'ప్రభవ' గతులు!

# ఎల్లలు మరచిన వేళ

ఎల్లలు మరచిన మూఢులు
కల్లల కథ వల్లించిరి
తల్లి ఎదను గునపాలతో
పెల్లగించి పెంపెల్లిరి
నేస్తపు మాటల వంచన
పరులకు బానిసలైరి
వాస్తవ చరితకు దొంగల
వక్ర దృష్టి జోడించిరి!

మోసపు సారాను మరిగి
దాస్యంతో తల తిరిగి
'తల్లి'కి శీలం లేదని
పొల్లుగార్చు వాజమ్మలు
రాజిలు రతనాల రాశి
వాసిని గురితించ లేక
గాజు పెంకు తళతళలకు
మోజుపడిన మ్లేచ్ఛాత్ములు!!

ధిషణా ఘన దీధిత జన
ప్రేషిత వన పోషిత వన
రస ఫలాభ్యుదయ మధురిమ
స్మృతి మరచిన ప్రోషితులు!

మానవతా మహోదధీ
మహిత ప్రయోజన మెరుగక
ఉప్పు నీరు అని నోటిని
చప్పరించు నిర్భాగ్యులు !

శతాబ్దాల పాటు నిదుర
పోయిన సంగతి తెలియక
'అర్ధ రాత్రి' లేచి పరుల
నపహసించు అర్భకులు
అనాదిగా అవని గతిని
నడిపించిన సూర్య కాంతి
ధృతి నెరుగక ఇదే మొదటి
సూర్యోదయ మన్నవారు !!

రక్ష లేని సామాజిక
కోశము దోచిన దొంగలె
'అమ్మ'కు వారసు లంటూ
ఆర్భాటించే మూర్ఖులు
సర్వ శ్రేయోభావ స్థితి
పునాది వీక్షించని
చ్యుత బుద్ధులు మిత బుద్ధులు
దాస్యము పంచే యోద్ధలు !!

.... .... .... .... .... .... .... .... ....

## ౨౯

ఈ యోద్ధల దుస్తంత్రం
ఛేదించగ 'సోదరులు'
'గృహ' ప్రాంగణ సీమలందు
వేనకు వేలై లేచిరి !

ఒక్క కంట శోక ధారలు
ఒక్క కంట ఆనంద ఝరులు
సంగ మించెను హర్షవ్యథలు
కలయ చూసెను 'ప్రభవ' కన్నులు !

# బింబ ప్రతిబింబాలలో

అర్ఘ్య సుధల అద్దంలో
వదనం అరసిన క్షణమున
ప్రతిబింబాలనేకములు
ప్రస్ఫుటించినవి 'ప్రభవ'కు
అనాదిగా సాగు స్వీయ
గమనాగమనపు ఛాయలు
ప్రతిబింబంలోన చరిత
గతుల జతను కూడినవి !

బిందు బిందు వొక బింబం
దినకర దీప్తుల నిలయం
మానస స్మృతి ఫలకంపై
మాయని వాస్తవ రూపం ! !
వేకువతో జగతి జనుల
చీకటి మాన్పిన తేజం

చీకటిలో ఆకలితో
అల్లాడిన అలసత్వం
అన్నీ భాసిస్తున్నవి
గుండెను ఘోషిస్తున్నవి
'గృహ' ప్రాంగణమందు గొప్ప
గుణపాఠం చెబుతున్నవి !

అద్వైతామృత ధారా
వాహిని తీరంలోనే
అన్నార్తుల ఆక్రందన
అంబర వీధుల నంటెను
సౌశీల్య వనాంతర్గత
ధర్మ వృక్ష ఛాయలందె
దోపిడి చేసిన సొమ్ముల
పంపకాలు పెంపెల్లెను !
బింబాలలో భాసించిన
ఆదర్శపు శిఖరంపై
రక్తం మరిగిన రాక్షస
మూకల నృత్యం జరిగెను
మానవతా దేవాలయ
మంటపాల మధ్యలోన
మద్యం మరిగిన బుద్ధుల
రాద్ధాంతం రాజు కొనెను ! !
శత సహస్ర దృశ్యాలకు
సాక్షీభూతం ప్రభవ
అమరమైన 'అమ్మ' కథను
వీక్షించిన మహో విభవ
వైభవ శిఖరాల కీర్తి
కేతన మెరిగిన దృశ్యం
అనైక్యతా అగ్నికీల
'ఇంటి'ని కాల్చిన దృశ్యం
'వదనం'లో కదలాడెను
'వనరాశి'ని మెదలాడెను
కర్మ సాక్షి కిరణాలతో
కలసి 'ఇంట' సభ దీరెను !

# అనాది నాదం

విచక్షణా క్షేత్రంపై
వివేకం కళ్ళు తెరచిన నాటికే
నా 'గృహ' ప్రాంగణంలో
విజ్ఞాన ఫల వృక్షాలు
విరగ కాచి ఉన్నాయి

ప్రజ్ఞామృత బిందువులు నిండిన
సాహితీ సుమాలు అభ్యుదయ
పరిమళం పంచుతున్నాయి !

పాశవిక దశవదలని
పాశ్చాత్య శిశువుల
అయోమయ హృదయాలు
అసహనంతో ఆక్రోశించిన వేళ
నా 'గృహం' ఆలపించిన
మానవతా వేద మంత్ర స్వరాలు
ఆ శిశు జనాళికి జోలపాడాయి
పాశవిక పాశం విడిపించి
శ్రేయోభావ క్షీరాన్ని అందించాయి !

.... .... .... .... .... .... .... ....

వృక్ష లతలకు జీవమిచ్చిన
సంస్కృతీ సరితా జలాలు
ఆర్షగీతాలాపనకు, అను
శ్రుతులు గూర్చిన అమర చరితలు
సరిత చరితకు చేవ కూర్చిన
జపతపో పర్జన్య తతులు
'యజ్ఞ' వాటిక నుండి వెడలిన
హోమ ధూమ ప్రభావితాలు!

సంఘటనా యజ్ఞమది
త్యాగభావ యజ్ఞమది
కర్మయోగులై శ్రమించు
కార్మిక జన యజ్ఞమది
ధర్మధ్వజ అరుణారుణ
ధగద్ధగల శోభలను
దశదిశలకు నడిపించిన
ధరణి జరుగు యజ్ఞమది !

వర్గద్వేష విషవాయువు
నిండిన పరిసర భూముల
క్షాళన చేసిన సమతా
మంత్ర మహాయజ్ఞమది

31

ఆకలితో అల్లాడిన
అవనికి అమృతము పంచగ
జీవితమే ఆజ్యముగా
చెలరేగిన 'యజ్ఞ' మది ! !

తొలి యజ్ఞపు వేదికపై
తొంగి చూసినది 'ప్రభవ'
తొలకరించినుకై మధురిమ
పండించెను మహా విభవ !

# ఒకనాడు.......!

ధర్మ ధ్వజ అరుణ కాంతులు
దైవ ధ్వజ శీతల ఛాయలు
ధరణీస్థలి నిండిన దృశ్యం
నరుడు అమరుడై నడచిన దృశ్యం
'గృహ' ప్రాంగణ వన వాటికలో
గురుపీఠం ఎక్కిన విబుధులు
సచ్ఛరితా ధర్మజీవన
ఉచ్ఛగతులను నేర్పిన దృశ్యం
సౌశీల్య సముజ్వల ప్రభతో
నభ మంటిన 'యజ్ఞ' జ్వాలకు
అవనీ జనసంతతి మొత్తం
నమ్రతాంజలి అర్పించిన దృశ్యం

రక్షణ పొందిన జనులే
రాక్షసులై చెలరేగి
ఇంటిపైకి దాడిపెడలి
మట్టిలో కలసిన దృశ్యం
అజేయమై చెలరేగిన
పౌరుషాగ్ని శిఖల ముందు
అసురుల బృందం మిడతల
దండై కూలిన దృశ్యం

'స్వ' జనాళికి, సుజనాళికి
'పర గృహాల' ప్రజావళికి -
బహుముఖ ప్రగతిని గూర్చిన
పరమ వైభవపు దృశ్యం ........
........ ప్రతిబింబంలో కదలెను
ప్రతిబింబాలలో మెదలెను
అభంగమౌ 'అమ్మ' చరిత
'ప్రభవ' స్మృతికి భాసించెను!

నిరంతరం ప్రజ్వరిల్లు
యజ్ఞ శిఖలు సృష్టించిన
సమైక్యతా గంధ భరిత
హోమ జనిత పర్జన్యం
వర్షించెను ప్రగతి జలం
హర్షించెను హరిత వనం
శ్రమ జలమై సుమ ఫలముల
సమకూర్చె సమష్టివ్రతం!!
తొలి యజ్ఞం చూసె 'ప్రభవ'
మలి యజ్ఞం కాంచె 'ప్రభవ'
శత సహస్ర యజ్ఞ కోటి
స్మృతులకు నిలయం 'ప్రభవ' ........

# గ్రహణం

వైభవ మయూఖ పుంజాలను
విశ్వమంతా వెదజల్లిన
'స్వ' ఐక్యభావ కర్మ సాక్షికి
అనైక్య 'రాహు' రోగం సోకింది!

గ్రహణ గ్రస్త బింబం
క్రమంగా నల్లబడింది
'నా' ఇల్లు గుల్లబడింది
సోదరగణం చతికిలబడింది!!

ప్రగతి శిఖరంపై విహరించిన
'మాతృ' సంతతి
పతన గహ్వరం వైపు
పరుగులు తీసింది!!!

.... .... .... .... .... .... ....

గ్రహణం ముదిరిన కొద్దీ
పతన క్రీడ హెచ్చింది
మేల్కాంచిన గుడ్లగూబ
ఆహా!! అని అరచింది

సౌజన్యం సౌశీల్యం
నిండిన పౌరుష తేజం
స్వార్థ గ్రస్తమై 'స్వ' భావ
ప్రభను తరిమి వేసింది !

వక్ర బుద్ధుల వెర్రి తలపులు
కూల్చి వేయగ 'ఇంటి' తలుపులు
వికృత రూప 'వి' దేహు లెందరో
విక్రమించిరి, ఆక్రమించిరి
అంధకారం అదనుగా కొని
ఐక్య శూన్యత పదనుగా కొని
దోపిడీకై వచ్చి దొంగలు
ప్రభువులై 'గృహ' పీఠమెక్కిరి ! !

గ్రహణ కీడుకు గతిని తప్పిన
మాతృ భావపు మతిని తప్పిన
'సుతుల' బుద్ధులు చెదలు పట్టెను
దొంగలకు పెత్తనము కట్టెను
జనహితమ్మే తన హితమ్మను
తీపి సిద్ధాంతము నశించెను
వన వరాహము రీతి మెక్కెడు
దోపిడీ సిద్ధాంత మయ్యెను !

'వి' జనావళి విద్రోహం
'స్వ' జనావళి తలకెక్కెను

స్వగృహ పతనమును గాంచి
'తల్లి' గుండె చెరువయ్యెను ! !

కాలపురుషుని చేష్ట కాదిది
కాలు జారినవారి కృతమిది
వేల ఏళ్ల చరిత్ర మరచి
కూలిపోయిన వారి కథ ఇది!

'తల్లి' సంతతి తలలు చెడిపిన
గ్రహణ తిమిరం తొలగిపోయే
కాలమెప్పుడు వచ్చునా అని
తలచుచున్నది 'ప్రభవ' తన మది.

# చెరగిన రూపం

పరవళ్లు దొక్కిన పాశవికత్వం
ప్రజా హృదయాన్ని ముంచెత్తింది
కాలకూటం కక్కిన కబంధుల
దర్పం కసితీరా నవ్వింది
మథన రేపు మంటల చూసి
మానవత్వం అదిరింది
కదను దొక్కిన రుధిర కాంక్షలకు
కాలచక్రం బెదిరింది!

నొక్కబడ్డ నీతి చరితలు
ఎక్కడో అణగిపోయాయి
దిక్కుకానక చిక్కిన నిజాలు
చీకటిలో కలసిపోయాయి
రాక్షస వనంలో బందీయై
రోదించింది సంస్కృతీ వనిత
రక్షా రహిత జనావళి
ఆక్రోశానల జ్వలిత!

స్వేచ్ఛామిళిందపు రెక్కలను
ముక్కలుగా నరికారు
మానవతా మధుర సుధను
మట్టిలోన కలిపారు

బుద్ధిజీవుల ప్రబోధాలు
కటకటాలు దాటి కదలలేదు
అమరజీవుల ఆర్తనాదాలు
అసత్య వాణిని అధిగమించలేదు!

.... .... .... .... .... .... .... ....

ముక్కలుగా చీలిపోయె
స్వజనావళి సంఘటనం
పక్కవాని రోదనమే
వినిపించని దుర్ఘటనం
గమ్యం తెలియని దిశగా
సాగెను సోదర జాతి
కుటిల మార్గ వర్తనులు
వినిపించిరి కొత్త నీతి!

చిందరవందరగా చెరగిన
సుందర 'గృహ' నందనము
'దొంగల'పాలై కూర్చెను
తోడేళ్లకు ఆవాసము
దోపిడియే ధర్మమయ్యె
పాపములే ప్రతిభ అయ్యె
వెలుగును చూపిన దీపమె
ద్వేషానల నిలయమయ్యె!!

దృశ్యానికి దృశ్యానికి
మధ్య ఎంత పెద్ద మార్పు

స్వయంకృతానైక్య పాప
మునకు ఎవ్వడిచ్చు తీర్పు?
ఎంత మారిపోయె రూపు
ఏమైనదో అసలు రూపు
వెతకి వెతకి నిట్టూర్పుల
వేగిపోయె 'ప్రభవ' చూపు!

కాలపురుషుని లీల కాదిది
కళ్లు తిరిగిన వారి కథ ఇది
వేల ఏళ్ల చరిత్ర మరచి
గోల చేసెడి వారి గతమిది!

# లయం కాని స్మృతులు

నభం వెంట నడచి వెళ్ళ
శుభ వీక్షణ 'సుదతీమణి'
యామిని ముగిసిన క్షణమున
ఆమనియై అవతరించె
సుప్రభాత సుప్రదాత
శోభన కాంతుల పంక్తుల
సుప్రకాశమై 'గృహము'న
అడుగిడి 'అమ్మ'ను చూసెను!

అడుగడుగున గత స్మృతులు
లయం కాని శ్రుతిలయలు
'అమ్మ' చరిత జతకూడిన
అమల కృతులు, వ్యథల కథలు
స్మృతి నిలయము 'అమ్మ' తలపు
స్మృతుల వలయమయ్యె చూపు
సుడులు తిరుగు ఘటనల పెను
కడలులు ఆ 'వనిత' కనులు!

ఒక కంటిలో హర్ష జలము
ఒక కంటిలో శోక రసము

హర్ష వ్యాకులము కలసిన
వర్ష మయము 'ప్రాంగణము'
వేద శ్రుతి నధిగమించు
కీర్తి శ్రుతి స్మృతి హర్షము
అధః పతనమైన చరిత
అపశ్రుతి స్మృతి విషాదము !

సృష్ట్యాది సమష్టి భావ
స్వరములు పలికిన 'గృహము'న
వ్యష్టికృత స్వార్థ భావ
వికృత ధ్వనులు వినిపించెను
అందరి నోళ్లకు అమృతము
అందించిన హస్తమ్ములు
సొంత నోటికై తమ్ముల
నోళ్ల కొట్టు పని పెంచెను !

ధరణి ప్రజకు సంస్కారము
నేర్పిన చదువుల 'గృహము'న
'సంతతి'లోనే శీలము
నశియించె అనైక్య ఫలము
అభ్యుదయపు శిఖరాగ్రము
నధిరోహించిన 'స్వ' జనులు
ఆత్మ స్థితి మరచి పరుల
అనుకరించి పతనమైరి!!

42

పతనం నుండీ ప్రగతికి
ఉత్థానం జరుగు టెపుడు ?
'అమ్మ' ముఖం చూసి 'ఆమె'
ఆనందం పొందు టెపుడు ?
గమనించని 'నా' హృదయం
'కర్మ' సాక్షి స్వాధీనం
ఆర్ద్ర సుధలతో ధర్మము
నభిషేకించిన తరుణం !

# సమాయత్తం

ఈ ఉదయం,
వేల ఏళ్ళ తమాల వాటిక
కూలి పోతున్న తరుణం
తపో వాటికలో,
చీకటి కేకల వ్యాకులం రేపిన
మూకలను
వేల వేల కిరణాలు
వెంటాడుతున్న సమయం !

ఇది,
స్వేచ్ఛగా, యథేచ్ఛగా
వారసత్వ సౌరభ విభవంతో
వీస్తున్న కుసుమ కోమల మారుతం
మాతృ గళాన మల్లెల తోరణం !

ఇది,
నేల కలసిన ఘూళి కరగిన
దాస్య వారుణీ వాసనా
అవశేషముల
మయమైన అనిలం !

.... .... .... .... .... .... .... ....

వచ్చె నదిగో వెలుగు అంటూ
వచ్చె ఆమని జిలుగు అంటూ
కోకిలమ్మలు కూయు చున్నవి
కొమ్మ లెక్కి ఆడు చున్నవి !

ఇంటి గోడల తొలచి తొలచి
పంట గాదెల దోచి దోచి
అంధకారము అదనుగా గొని
అతిశయించిన అడవి పందులు
ధర్మ భాస్కర ధవళ శరముల
ధాటి కోర్వక పారు చున్నవి !
యజ్ఞ వాటి సమైక్య సమిధల
వెలుగు రవ్వలు చెలగు చున్నవి !!

.... .... .... .... .... .... .... .... ....

ఈ ప్రభాతం,
అనైక్యతా అకృత్యాలకు అలగి
దాస్య గ్రహణాలను నింపిన ప్రకృతి
'అమ్మ' సంతతి పై మళ్ళీ
అభ్యుదయం కురిపిస్తున్న తరుణం
వికృత భావాలను
విసర్జించిన దివ్యాకృతులు
ధిషణా కృత మంగళాభిషేకులై
ఐక్యతా కృతుల రచనకు
ఆయత్త మౌతున్న సమయం !

## 46

ఇది,

సంధ్యా సమయం

సంధి సమయం

జాగృతమైన 'హృదయం'

'ప్రభవా' గమన ఆనంద మయం !

ఉదయిస్తున్న వానిపై 'నా' దృష్టి

సంధ్యా క్షేత్రంపై అర్ఘ్య సుధల వృష్టి !

# సందర్శనం

అర్ఘ్యమ్ముల సమర్పించి
ప్రణమిల్లిన "నా" హృదయం
ఉదయించిన "ప్రభవ" సతిని
వీక్షించెను మరు నిమిషం!
తిలకించిన హృదయమ్మున
మొలకెత్తెను సంభ్రమం
క్షణమున వనమై విరిసెను
మకరందపు పరిమళం!
అనునయ నయనాల నిండు
అభ్యుదయపు వీక్షణాలు
"అమ్మ" సుతుల నడిపించే
అరుణ కాంతి శుభకణాలు!
ఆత్మశక్తి గురుతెరిగిన
స్వార్థరహిత శ్రమజీవుల
లక్ష్యానికి స్వయంస్ఫూర్తి
సమకూర్చిన వీక్షణాలు!!
ఎంత సుందరము తనువు
సొగసు కురిసె అణువణువు
వింత వింత కాంతులతో
విశ్వమంతటికి నెలవు!

ఆ రూపం అఖిలమ్మును
ప్రసరించిన "ప్రమ" రూపం
ఆ రూపం అభంగమౌ
ప్రకృతి కృతుల ప్రతిరూపం!
ఆ రూపం అనిర్వచిత
అమర శోభలకు నిలయం
ఆద్యంతపు అవధి లేని
సమయ సంహితా నిలయం!!
ప్రగతి ప్రతిమలు జగతి ప్రతిభలు
నిగమ ఆగమ సుగమ చరితలు
నిదుర లేచిన నిఖిలమున శ్రమ
సుధలు కురిసిన ధీవియత్తులు,
నగధరమ్ములు యుగధరమ్ములు
జలధరమ్ములు ఖగ ధరమ్ములు
"పరమసత్య" ప్రభ ప్రతీకగ
ప్రస్ఫుటించిన పరిసరమ్ములు
"మగువ" వదనమ్మున స్ఫురించెను
యుగయుగాల సరాలు మెరిసెను!

# నిజరూపం

అమరధృతులు అమరించిన
ఆత్మపథం వెంట సాగు
శ్రమ రథమును నడిపించే
శుభ ప్రభల సదనం
ఆ వదనం!
సమర శీల, సమరసాల
సుమ గంధ సుశీల మిళిత
పవన జ్వలిత ప్రగతిభావ
హోమాగ్నుల నిలయం
ఆ హృదయం!
హితభావన కమృతమై
అసుర చేష్టలకు విషమై
అఖిలానికి జీవమిచ్చు
శుభ స్తన్య క్షీర భరిత
సుందర వక్షస్థలం!
సృష్టిస్థితిలయల కృతుల
మృష్టాన్నముగా భుజించి
ప్రకృతిని సంతుష్టినింపు
పరమ జీర్ణకోశం
ఆ ఉదరం!

ధరాతలము సురస్థలము
చరాచరము పరాపరము
అస్తిత్వమ్మును పొందెడి
అఖిల జన్మ క్షేత్రం
ఆ జఘనం !
కాలపురుష కర్షక పరి
పోషిత పరిణత ఫలముల
పక్షపాత రహితంగా పంచిపెట్టు
యుగళం, 'ఆమె' కరయుగళం !
భ్రమణ పరిభ్రమణ గతుల
నధిగమించి నడయాడెడు
చల నిశ్చల నిశాప్రభల
ఆవలి తీరం 'ఆమె' పద గమనం !
ప్రభవించిన భ్రాంతి కౌలిపి
'ప్రమ' ప్రతిరూపం నిలిపి
ప్రభవము, ప్రళయము లేని
'ప్రభవ' ఆమె నిజరూపం !
తిలకించిన 'నా' మనమున
మొలకెత్తెను సంభ్రమం
క్షణమున వనమై విరిసెను
అణువణువున పరిమళం !

# విశ్వ వ్యాపిత

అపజయ జయముల కూడిన
"అమ్మ" సుతుల చరిత గాంచి
హర్ష వ్యాకులము నిండిన
నీరజములు "ఆమె" కనులు
"ప్రాంగణము"న ప్రభవించిన
వేద విపంచి స్వరముల,
పశ్చిమ దిశనుండి వచ్చు
పైశాచిక నిస్వనముల
ఆలకించి ఆ రెండిట
అంతర మెరిగినవి చెవులు !
ఉచ్ఛ్వాసం ఉత్థానం
నిశ్వాసం పతనముఖం
ఘ్రాణేంద్రియ రంధ్రమ్ములు
జనన మరణ ద్వారమ్ములు
విశ్వానికి శుభములను
విద్రోహికి శాపములను
పలుకు 'వనిత' అధరమ్ములు
ప్రకృతి హాస మధురమ్ములు !

కాలపురుష హృదయమ్మును
కవ్వించెడు పాశమొకటి
రాక్షస గణముల దునిుంచగ
కాళకాల పాశమొకటి
ప్రణయ ప్రళయములు గూర్చును
"ఆ" కుంతల పాశములు !
చూడామణి పాలవెల్లి
తారలు శిరసున మల్లెలు
తలపున తన్మయము గూర్చ
"అమ్మ" స్మృతులు కోకొల్లలు
రుతువు రుతువుకొక రూపం
శాశ్వత హరిత స్వరూపం
ప్రకృతికి ప్రతిరూపమైన
సీమలు వస్త్రాంచలములు !!
గృహ ప్రాంగణ జనిత, సకల
జీవవిహిత, అఖిల వినుత
సాహిత్యం సంగీతం
"ఆమె" కర్ణ కుండలములు
ఆదర్శము జీవనమై
"అమ్మ" సేవ కంకితమై
అవనికి అమృతము పంచిన
"అమరులు" గళ హారమ్ములు

గత విజయపు వైభవ ఖ్యాతి
లయలతోడి జతకూడిన
వాస్తవాల ప్రతిధ్వనులు
కర కంకణ శుభ ధ్వనులు
వర్తమాన "గృహ" ప్రాంగణ
సంఘటనా నృత్యమ్ముల
సరిగమలతో చెలిమి చేయు
చరణాభరణ స్వరములు ! !

విశ్వానికి విహితమ్మును
పంచిన "అమ్మ" సుశీలము
ఆద్యంతము లేని "ఆమె"
శిరసున మణిమయ మకుటం
చంద్రయాన "మామె" రథం
కోటి ప్రభల వెలుగు పథం
"ప్రాంగణ" వైభవ సూర్యుడు
వనిత ఫాలమున తిలకం
కాలపురుషునికి సగమై
వేల యుగమ్ముల జగమై
భవిష్యత్తును పదిలపరచు
బంగరు సూత్రం! !
"ఆమె" మంగళసూత్రం ! !

53

వేదమామె, మానవతా
వాదమామె ఆద్యంతము
లేని సంస్కృతీ శైశవ
డోలికలో ఆటలాడు
మోదమామె, అద్వైత ప్ర
మోదమామె ! 'ప్రభవ' ఆమె !
తిలకించిన "హృదయమ్మున"
మొలకెత్తెను పరవశం
కర్తవ్య పథమ్మునందు
కనిపించెను వైభవం ! !

# విభవ దర్శనం

స్వగృహ సంస్కృతి గంగా
ధారలతో జలకమాడి
తరతరాల వారసత్వ
తిలకమ్మును నుదుట దాల్చి
'అమ్మ' సేవ కొరకు, అమృత
సాధకులౌ సోదరులు
'గృహ' ప్రాంగణ సీమయందు
వేనకువేలై లేచిరి
సమైక్యతా సుప్రభాత
గీతము లాలాపంచిరి !
శీలయుతము సమర పథము
అవిశ్రాంత శ్రమ సహితము
అజరామర విభవ సిద్ధికై
సంఘటనా మంత్రము
ధర్మధ్వజ అరుణ కాంతి
దారి చూపు పయనము
'కేశవ మాధవ' ప్రేరిత
కర్తవ్య మహాయజ్ఞము !
పులకితమౌ 'నా' హృదయము
ప్రణమిల్లెను ప్రభవకు

'అమ్మ' సుతులపై ప్రగతిని
వర్షించే విభవకు!
శుభప్రభల శోభలతో
ప్రస్ఫుటించె ప్రాభవం
భవిష్యత్తున గృహామందున
కనిపించెను వైభవం!
తొలి రోజున గృహామందున
దోపిడితత్వం శూన్యం
భవిష్యత్తున ప్రాంగణమున
దోపిడి భావం పూజ్యం
పశ్చిమ దిశ నుండి పడిన
దోపిడి విషవృక్షమ్ముల
సమూలముగ కూల్చివేయు
శుభ ప్రభంజన వ్యూహం!
శ్రమనాదం విశ్వవిహిత
వేద శ్రుతులు వినిపించును
సమభావ సనాతనత్వ
ప్రేమ ప్రస్ఫుటమై వెలుగును
పరమ విభవ వీణ ప్రగతి
సరిగమలను పలికించును
'గృహ' ప్రాంగణసీమ కనక
కాంతులు కళకళ లాడును!
మధుర మధుర మాతృ మమత
మది మదిలో ఉప్పొంగును

భ్రాతృభావ సుధాఝరులు
విభవములను పండించును
చందమామ సొగసు వంటి
స్నేహ సుగంధం విరియును
మానవతా మకరందపు
హర్షవర్షములు కురియును !
చెరగిన 'మా' 'అమ్మ'రూపు
తిరిగి సమగ్రత గాంచును
విఘటితమౌ గృహము సకల
నిజ భూమిని సాధించును
అఖిల జనులు అంజలించు
ఆచార్యత్వమును పొంది
దివికి భువికి శుభము కూర్చ
'అమ్మ' అమ్మలకు అమ్మ !
తిలకించిన హృదయమ్మున
మొలకెత్తెను సంభ్రమం
'ప్రభవ' కాంత వదనమ్మున
విజయ విభవ దర్శనం!!